# శతభస్మ యోగములు

★

గ్రంథకర్త

శ్రీ కనకపండి సీతారామయ్య

★

ప్రచురణ

కాళహస్తి తమ్మారావు అండ్ సన్సు.,

సంస్కృతాంధ్ర బుక్ డిపో :: రాజమండ్రి-1

 వెల : 6-00

# శ త భ స్మ యో గ ము లు



గ్రం థ క ర్త

శ్రీ కనకదండి సీతారామయ్య



ప్ర చు ర ణ

కాళహస్తి తమ్మారావు అండ్ సన్సు.,

సంస్కృతాంధ్ర బుక్ డిపో :: రాజమండ్రి-1

 వెల : 6-00

# విషయసూచిక

తామ్రభస్మము
తామ్రభస్మము రెండవక్రమము
తామ్రభస్మగుణము
దీనివల్ల హరించు వ్యాధులు
మోతాదుక్రమము
అశుద్ధభస్మదోషగుణములు
యిందుకు విరుగుళ్లు
వెండిభస్మము [ లేక ] రజితభస్మము
దీనికి రెండవ ప్రకరణము
రజిత సింధూరము
రజితభస్మమువల్ల యుపయోగములు
ఈ భస్మము వాడుక్రమము
అశుద్ధభస్మసేవనవలనగలుగు దోషములు
రోగానుగుణ్య అనుపానములు
స్వర్ణభస్మము
స్వర్ణభస్మము రెండవక్రమము
డిటో మూడవక్రమము
దీనియొక్క యుపయోగములు
అశుద్ధసువర్ణభస్మ గుణము
అశుద్ధ సువర్ణభస్మసేవకు విరుగుళ్లు

# శ త భ స్మ యో గ ము లు

## మొదటి ప్రకరణము

### నల్లసీస భస్మము

ఒక మోపెడు వావిలాకు తీసుకువచ్చి పెద్దదిగా వెడల్పుగా యుండె గోనెపట్టలో పరచి నల్లసీసపుముక్కలు వరహాయెత్తుగా చిన్న చిన్నముక్కలుగ పరచి పయిన వావిలాకు పరచి దానిపయిన వంగము ముక్కలు పరచేది. ఈ ప్రకారం కావలసినట్టుకుపరచి గోనెపట్టను గట్టిగాచుట్టి ఏడుపిడకలతో పుటంపెట్టి చల్లారినతరువాత యెత్తి మెల్లగా బూడిదనంతయు తీసివేసి కత్తితో సీసపుముక్కలను మెల్లగా మెత్తుకునేది తరువాత ఖల్వములోపెట్టి నూరుకోవలయును. ఈ భస్మము తెల్లగా యుండును. అనుపానవిశేషములతో వాడితే సీతమునుహరించి జ్వరము సన్నిదోషమును పోగొట్టి శరీరము వేడికలుగజేయును. అల్లపురసము తేనె వీటితో మిశ్రమముచేసి పుచ్చుకుంటే మూత్రరోగము నివారించును.

త్రివంగ భస్మము

శుద్ధిచేసిన నల్లసీసము, శుద్ధిచేసిన తగరము, శుద్ధి చేసిన నాగము సమాంశముగా ఈమూడున్ను ఒకచట్టిలోవేసి కరగించి కరుగుసమయములో కొద్దిగా [ బంగియాకు ] లేక బంతియాకు కొంచెముకొంచెముగావేస్తూ కలియపెట్ట వలెను. తరువాత దానిని యెత్తుకొని బంగియాకుపసరుతో మూడుఝాములు మర్ధనాచేయవలయును. అట్లుచేసినబంగారు ఛాయగా భస్మము తయారుఅగును. ఈ త్రివంగభస్మము అన్నిరుగ్మతలకు వాడుకోవలయును. యిది సంకటరోగము లను బాగుగా హరింపచేయును.

వంగభస్మము

ప్రశస్తమైనవంగం తీసుకువచ్చి శుద్ధిచేసి శుద్ధిచేసినరేకుల పయి కఫరినూరి లేపనముచేసి యంటించి అగ్నిలోకాచిన తగరము భస్మమగును లేక తగరమును పెంకులో పోసి కరగించి అందు అమరసిల గంధకమును, తాళకమును సూరేకారమును సమభాగములుగా చూర్ణముచేసి కొంచెము కొంచెముగ వేయుచు వేపకర్రతో వేయింపుచుండిన తగరము భస్మమగును.

2వ మాదిరి

శుద్ధిచేయబడిన తగరమును పెంకులోపోసి కరగించి యందు త్తరేణు చూర్ణముపైచి పొంపుచుండిన తగరము భస్మమగును. దానిని నిమ్మపండ్లరసముతో నూరి మూడు గజపుటంబాలిడిన సింధూరించును.

3వ మాదిరి

శుద్ధతగరపు రేకులపయిన కఫరి నూరి లేపనముచేసి అగ్నిలో కాచిన తగరము భస్మమగును.

వంగభస్మ గుణము

యిది చేదుగ నుప్పగ నుండుటయేగాక పాండుక్రిమి, వాతము హరింపచేయునదిగా లేఖనకారిగ ఒకింత పిత్త కారిగ సర్వమేహవ్రణముల బోకడచునదిగా నుండును.

2వ మాదిరి

సర్వమేహములను పైత్యములను హరించును. శుక్ల నష్టము ప్రమేహము, సెగరోగము, తాపము, పాండు, క్రిమి రోగము వీనిహరింపచేయును. మిక్కిలి వీర్యవృద్ధిచేయును. భ్రమ, కఫము, క్షయరోగము, శ్వాస, శూల, పసునము.

ప్రదరరోగము, వీనిని పోగొట్టును. ఆయుర్వృద్ధి, బలము, వీర్యము, కామము, అగ్నిదీప్తి, బుద్ధిబలము, ధాతు స్థైర్యము వీనిని కలుగజేయును.

**అశుద్ధ భస్మసేవనవలన గలుగు రోగములు**

వాంతి, భ్రాంతి, శుక్లనాశనము, తాపము, గుల్మము, కుష్ఠువు, గుల్మము, పాండువు, ప్రమేహము, పొక్కులు, వాతము, రక్తవికారము, కామక్షయము మొదలగుననేక మహారోగములు గలుగును.

**దోషయుక్తంబగు భస్మమువల్ల కల్గినవికారమునకు విరుగుళ్లు**

ఒడ్డివేరుచెక్క చూర్ణములో సమముగ కలకండ గలిపి పూటకు బేడయెత్తు చొప్పున ప్రాతఃపూటను, 10, 15 దినములు పుచ్చుకొనవలెను.

2వ వాదిరి

తాటికాయ, వుసిరికాయ, కరక్కాయ, పిప్పళ్లు, వీనిచూర్ణము పైనచెప్పిన విధమున సేవించవలయును.

**వంగభస్మము మోతాదు**

పూటకు ఒకటిమొదలు యెనిమిది గురివెంతగింజల యెత్తువరకు వాడవచ్చును.

అనుపానములు ఫలితములు

పచ్చకర్పూరముతో సేవించిన నోటి దుర్గంధము పోవును. ఆవుపాలతోగాని, జాజికాయతోగాని సేవించిన వీర్యవృద్ధి గలుగును. ప్రమేహమందు తులసియాకుతోడను, గుల్మము, ప్లీహ, వీనియందు వెలిగారక్షారముతోడను. పాండువునందు ఆవునేతితోడను, పూర్ధ్వశ్వాసరక్తపిత్తము వీనియందు పసపుచూర్ణముతోడను. పైత్యమునందు శర్కరతోడను, సేవించవలయును,

తేనెతో సేవించిన బలము గలుగును. కస్తూరితోగాని, తమలపాకుతోగాని, సేవించిన వీర్యస్తంభన గలుగును. పోకలచూర్ణముచే సేవించిన అజీర్ణమును వెల్లుల్లిరసముతో సేవించిన అస్తిగతజ్వరమును, వావిలిఆకురసముతో సేవించిన కుష్టురోగమును, మజ్జిగతో సేవించిన వాత గుల్మరోగములు ఉత్తరేణి సమూలములతో సేవించిన శిరోరోగమును, జాజికాయ జాపత్రి లవంగములు సముదాయ చూర్ణముతో సేవించిన ధాతుదోషమును, జాజికాయ, ఫెన్నేగడ్డ సముదాయచూర్ణముతో సేవించిన నడుమునొప్పియు హరించును.

పత్యము

ఆవ, గుమ్మడి, పులుసు, నూనె, కోడిమాంసము,

పచ్చిచేపలు, తదితరమాంసములను వర్జింప వలయును, బచ్చలకూర వాడరాదు.

నల్లసీసభస్మము ౨వ క్రమము

నల్లసీసమును కరగించి యిప్పనూనెలో (పదకొండు) మార్లు బోసిన శుద్ధియగును. తరువాత దీనిని చింతాకులాగున పలుచగా రేకులుచేసి రేకుగట్టినిబట్టి ఫలము వంగము, రేకులకు వరహాయెత్తు వీర్యనల్లతులసిఆకు రసముతో మర్దించి వంగరేకునకు దళముగాపూసి ఆరనిచ్చి, చిన్నప్రమ్మిదలో బెట్టి పయినమూతమూసి శీలమన్నుయిచ్చి ౧౦౦ పిడకలతో పుటంవేసిన భస్మమగును.

ఈ భస్మము ఖల్వములోనుంచి నిమ్మపులుసుతో మర్దించి బిళ్లచేసి ఎండబెట్టి ప్రమ్మిదలోవుంచి చీలమన్నుయిచ్చి ౨౫ యిరువై ఐదు పిడకలతో పుటంవేసిన భస్మము అగును.

నాగభస్మము

శుద్ధిచేసి నాగం పలుచగా రేకుగాకొట్టి సర్వీరం, శంకు పాషాణము, పూరం, యివి పుమ్మిత రసముతో మర్దించి నాగమునకు కవచమిచ్చి ప్రమ్మిదలోవుంచి శీలమన్నుయిచ్చి గజపుటంబిడిన భస్మమగును.

2వ నాగభస్మము

తాళకమున్ను ఆదొండాకు పసరతో మర్దించి పక ఫలము నాగానికి లేపనముచేసి యెండించి ప్రమిదలోవుంచి చీలమన్నుయిచ్చి యాభై పిడకలతో పుఠంవేసిన భస్మీకరించును.

ఉపయోగము

ఈ భస్మము నెయ్యి, తేనె, వెన్న, ఈఅనుపానములతో పుచ్చుకున్న మూలరోగములు, నాభిపుండు, పసిమి రోగములు, మొదలయినవి మానును.

మరియొక క్రమము

నాగము యిప్పనూనెలో పదకొండు మార్లు కరగించిన శుద్ధి యగును. యిట్లుచేసినది బిళ్లచేసుకొని నల్లేరువ్రేళ్ల పట్టుతోకవళయిచ్చి మండిగయందుంచి చీలమన్నుయిచ్చి ముప్పది పిడకలతో పుఠంవేస్తె భస్మమగును. ఈభస్మము సకలజనులకు యుపయోగపడును.

ఉపయోగములు వాడుక్రమము

ఈ భస్మము మేహశాంతియు బలుపయును చేయును. కాస, గ్రహణి, భగందరము, దాహము, పాండువు, క్రిమి రోగము, క్షయ, గుల్మ, భ్రమ, కఫము, మూలవ్యాధి,

వాతము, అగ్నిమాంద్యము, సూల, ప్రమేహము, వీనిని బోగొట్టును. వీర్యవృద్ధి చేయును, మిక్కిలి బలముచేయును. ఆయురారోగ్యమునిచ్చును. అకాలమృత్యువును సర్వరోగములను పోగొట్టును.

**మోతాదు క్రమము**

మోతాదు పూట 2 మొదలు 6 గురివింతగింజలయెత్తు వరకు అశుద్ధ భస్మదోషములు కుష్టు, గుల్మము, పాండువు, అరుచి, క్షయ, కఫము, రక్తవికారము, మూత్రకృఛ్రము జ్వరము, అశ్మరి, శూల, భగంధము, పక్షవాతము, వీనిని బుట్టించును. ఇందుకు విరుగుడు 22 వస, కరక్కాయ, కలకండ ఒక్కొక్క దినుసు సమూల చేదెత్తు గొప్పున నీళ్లతోనూరి పది పండ్రెండు దినములు ఉదయంపూట పుచ్చుకొన్న దోషము నివృత్తించును.

**అనుపానములు**

దీనిని కలగండతో సేవించిన పైత్యము, వాతము, కీలనొప్పి, నేత్రరోగము, శుక్లదోషము, సంపరింఘము, తాపము, వీనిని హరించును రుచిగలుగును వీర్యవృద్ధి చేయును. తక్కినరోగములకు తగిన అనుపానములతో వాడవలయును.

3

### తాళక భస్మము

తాళకము మూడుతులములు తీసుకవచ్చి ఒక చట్టిలో పోసి పొయ్యిమీద పెట్టి వేపాకుదంచి రసముతీసి ఎనిమిది ఝాములు చురుకిచ్చేది. తర్వాత నిమ్మపండ్ల రసముతో మర్దించి బిళ్లచేసి ఎండలోపెట్టి ఎండినతరువాత ప్రమిదలో వుంచి శీలమన్నుయిచ్చి పుటంవేసి ఎత్తుకునేది. తరువాత వేపాకునూరి, కవచమిచ్చి, ఎండబెట్టి, శీలమన్నుయిచ్చి 16 పిడకలతో పుటంవేసేది. భస్మమవును.

### తాళకభస్మము రెండవమాదిరి.

శుద్ధిచేసిన తాళకమును రేకులుగా నొలిచి గలిజేరు రసముతో నొకదినము మర్ధించి యుండచేసి యెండించి దానిని బిందివలె చిన్నని నోరుగల మంటిపాత్రలో నుంచి దాని కంఠమువరకు గలిజేరు రసముపోసి దానిపై మూసి అయిదుదినములు అహోరాత్రములు పొయ్యిమీద నుంచి క్రమాగ్నులతో నెడతెగక వుండినతాళకము స్వచ్ఛమైన భస్మం యగును.

### తాళకభస్మముయొక్క గుణము.

తాళకభస్మం గురిగింజయెత్తు అనుపానవిశేషములతో సేవించిన సర్వరోగములను హరింపజేయును.

మఱియు కఫమును మేహమును హరించును. మనో వికాశము నిచ్చును, శ్లేష్మము, వాతము, విషము, రక్త దోషము, ధాతదోషము వీనిని హరింపజేయుటయేగాక అగ్నిదీపనము గలుగంజేసి శిలపీడను బోకడచునదిగను, స్నిగ్ధముగను, నుష్ణముగను, క్షారముగ, లేఖనకారిగ కుష్ఠువు లను హరింప చేయునదిగ యుండును.

అశుద్ధ తాళకభస్మ దోషము

ఆయువును క్షీణింపజేయుటయేగాక కఫము, వాతము, మేహం, శరీరతాపం, స్ఫోటకముపలె వళ్లుఅంతయు పొక్కుట, అంగసంకోచము, వీనిని గలుగంజేయును. కావున దానిని బాగుగా తయారు చేసుకోవలయును.

తాళకభస్మమునకు విరుగుళ్లు

నీటిపిప్పలిఆకు అనగా బొగ్గిసఆకు, రెండు మిరియాలు వేసి కాచిన కషాయము దీనిచే వంగము భస్మమగును.

ఉక్కు భస్మము

పదిహేనుతులముల వుక్కుపొడి తీసుకువచ్చి తెల్లటి పింగాణీలోవుంచి దానినిండుగా తెల్లజిల్లేడుపాలుపోసి యిరువది దినములు ఎండలో బెట్టిన తెల్లని సున్నమవును.

ఈ సున్నము సకల ప్రయోగములయందు వాడుకోవచ్చును.

ఉక్కు భస్మము యొక్క గుణములు

రక్తమును శుభ్రపరచును, క్రొత్తరక్తమును పుట్టించును. పొట్టకు బలమునిచ్చును, జఠరదీప్తినిచ్చును, సర్పవిషము, పాండువు, మూలవ్యాధి, గ్రహణి, జ్వరము, కఫము, దగ్గు, శ్వాస, ఉబ్బు, ప్రమేహము, గుల్మము, ప్లీహ, క్షీణత్వము, పైత్యరోగము, శరీర స్థౌల్యము, ముదిమి, నేత్రరోగము, అష్టవాతము, మహాకుష్టువులు, శ్వేతకుష్టువు, రక్తవికారము, మొదలగు ననేక రోగములను హరించి ఆయుర్వృద్ధి, బలము, వీర్యము, కాంతి వీనిని గలుగజేయును.

వాడు క్రమము

పూటకు గింజయెత్తు మొదలు ఆరుగింజలయెత్తువరకు దీనిని వాడవలయును. యిది సేవించు దినములలో స్త్రీ సాంగత్యము, అతివ్యాయామము, ఎండనుతిరుగుట, చింత, అతిఆలోచన పులుసు వీనిని వర్జింపవలయును.

పగడ భస్మము

పగడములు పలుకులుగా చేసి పుల్లటిపెరుగులో పక దినంపూరనిచ్చి మరునాటి దినం కడిగివేసి ఎండబెట్టి పద

చట్టిలో వాకుడుసమూలం నలియగొట్టి చట్టిలో సగముమట్టుకు బోసి దీనిపయిన పడపుతునకలను బోసి వాకుడువేసి శీలమన్ను ఋచ్చి మూరెడుపుతంబెట్టిన భస్మమగును.

ఈ భస్మముయొక్క ఉపయోగములు

ఈ భస్మము నేయితోగాని, తేనెతోగాని, పుచ్చుకుంటే దగ్గుమానును. వాకుడు చూర్ణముతో పుచ్చుకుంటే మేహదగ్గులు మానును. తాళిసపత్రిచూర్ణముతో పుచ్చుకుంటే వాంతులు కడుపులో మంటలు పిత్తవాయువులు మానును.

ఈ భస్మమువల్ల పోవురోగములు

పైత్యము, శ్లేష్మము, అగ్నిమాంద్యము, దగ్గు, మేహకారకము, మేహవాతము వీనిని హరించును. త్రిదోషముల నడంచును. వీర్యవృద్ధి, బలము, దేహపుష్టి చేయును. అతిమూత్రము, రక్తము స్రవించెడు మూలవ్యాధి, క్షయ, పొట్టలోని వాతము, క్రిమిరోగము వీనిని హరించును. హృదయమునకు పొట్టకు బలము చేయును.

ఈ భస్మము వాడు క్రమము

మోతాదు పూటకు (రెండు) మొదలు (నాల్గు) గురిగింజలయెత్తు చొప్పున దినమునకు రెండుపూటల్లు నియ్య

నగును. పట్టిది సేవించిన నాలుక పొక్కును. శొంఠిచూర్ణము, జీలకర్రచూర్ణము, వెన్న, తేనె, మొదలగువానిలో దేని నయిన కలిపి పుచ్చుకొనవలయును. నెయ్యి, తేనె, కలకండ వీనిని సమభాగములుగా గ్రహించి ఆవుపాలతో పుచ్చు కొనిన దోషయుక్తప్రవాళ (పగడ) భస్మసేవవలన గలిగిన వికారములు నివృత్తించును.

గరుడగంధక భస్మము

గంధకము ఖల్వములో నుంచి దుష్టుపాకురసముతో మర్దించి బిళ్లచేసి ప్రమిదలోవుంచి గట్టిగా చీలమన్నుయిచ్చి యెండుపిడకలతో పుతంవేసిన (2) భస్మమగును. మరిన్ని వద్లముక్కుఆకురసముతో మర్దించి పుతము వేసినయెడల భస్మమగును.

తామ్రభస్మము

తామ్రము పలుచగా చింతాకులవలె రేకులుగొట్టి పొగాకు సమూలము దంచి రసముదీసి రేకులను కాల్చుతూ యిందులో ముంచవలయును. యిట్లు కొన్నిమార్లు ముంచి మూడుతులముల తామ్రరేకుకు ఆరుశేర్లు పొగాకురసము ఒక పిడతలో పోసి పయిన రేకులనుంచి పొయ్యిమీదబెట్టి మంట వేయవలయును. రసముతో వండినతరువాత యెత్తి

కొని వామిటివేళ్ల పట్టకాటుక వలెనూరి కొబ్బరికాయయం ముద్దచేసి ఈ ముద్ద మూసగాచేసి తామ్రరేకునువుంచి కొం చెము తులసివేసి మూస మూతమూసి చీలమన్ను గట్టిగా యిచ్చి 14 పిడకలతో పుటంవేసిన భస్మమగును.

తామ్రభస్మము రెండవక్రమము

తామ్రమును శుద్ధిచేసుకొన్నపిదప యా తామ్రమునకు సమముగా రసములు గంధకము నుగ్రహిపరచి జిల్లేడు పాలతోనూరి యా రేకుపై పట్టించి పుటంబిడిన తామ్రభస్మం అగును. ఆ తామ్రభస్మమును పంచామృతములతో మర్దించి మూడుపుటంబులిడిన అంచలి అష్టవిధదోషములు హరించి స్వచ్ఛమైన తామ్రమగును.

తామ్రభస్మ గుణము

యిది పగరుగ, మధురముగ, కషాయముగ, లేఖన కారిగ, లఘువుగ, విషపాతము గలదిగ, విరోచనకారిగ, శీతకారిగ, కఫ, పిత్తరోగములను హరింపచేయునదిగ నుండు తామ్రమును యుక్తానుపానముతో సేవించిన యక్ష్మ, జ్వరము, పీడ, కుష్టువు, పాండువు, శూల, మేహము, గుదరోగము, వాతము, స్థౌల్యరోగము. ముదిమి, అగ్ని

మాంద్యము, అనువాటిని హరింపచేయుటయేగాక ఒక సంవత్సరము సేవించిన వంధ్యాత్వముగూడ బోవును.

దీనివలన హరించు వ్యాధులు

విరోచనములు, దగ్గు, శూల, గుల్మము, పాండువు, పరిణామశూల, క్రిమిరోగములు, కడుపులోబల్ల, కుష్ఠువు, వుదరరోగము, పలువిధములగు వ్రణములు, శ్లేష్మము, వాతము, జ్వరము, వాంతి, మూలవ్యాధి, ప్రమేహము, శిరోరోగము, ఎక్కిళ్లు, శ్వాస, కాసలు, వాపు, తంద్ర, భ్రమ, మూర్ఛ, అతిసారము, క్షయ, మొదలగు అనేక అసాధ్య రోగములు హరించును. అగ్నిదీప్తి ఆరోగ్యము నిచ్చును.

మోతాదు క్రమము

ఒకటి మొదలు మూడుగింజల యెత్తువరకు వాడవలయును.

అశుద్ధ భస్మ దోషగుణములు

వమనము, విరోచనము, మూర్ఛభ్రమ, మేహము, దేహము దోసపండు పగిలినట్లు పగులుట, శుక్లక్షయము, దౌర్బల్యము, వీటిని కలుగజేసి ఆయుక్షీణము చేయును.

యుందుకు విరుగుళ్లు

అడవిదాన్యము నివ్వరిదాన్యము యొక్క బియ్యము, కలకండ, సమముగా నీళ్లతోనూరి ప్రాతఃకాలమున మూడు దినములు సేవించినను శుద్ధగంధములను కొన్నిరసములు సేవించినను తామ్రదోషము నివృత్తించును. తామ్రభస్మమును గ్రీష్మ, శరదృతువులయందు పుచ్చుకొనగూడదు.

వెండిభస్మము ( లేక ) రజితభస్మము

వెండి పలుచని రేకులుగకొట్టించి పొగడపూల రసముతో వెండి రేకులను కొలిమినిప్పులో పలుమార్లుకాచి యిరువదియొక్కసారి పొగడపూలరసముచేసిన వెట్టియౌను. తరువాత హేమాక్షికము ఇంగ్లీకమును చేర్చి నిమ్మపులుసుతో మర్దించి వెండి రేకులకు పట్టించి పలుచగాయుండే ప్రమ్మి దలో వుంచి చీలమన్నుయిచ్చి నలుబది పిడకలతో పుటం వేసిన చల్లారిన తరువాత తిరుగ పైన మందునుపూసి యిరువదిఅయిదు పిడకలతో పుటంబెడితే భస్మమగును.

రెండవ ప్రకరణము

శుద్ధిచేసిన సన్నని వెండిరేకులపై హేమాక్షికమును చనుపాలతో మెత్తగనూరి పలుమారు బూసి యెండించి వజ్ర మూసలో నుంచి ఏడు పిడకలతో గజపుటంబిడిన వెండి భస్మ మగు లేక బంగారువలె పుటంబిడినను వెండిభస్మమగును.

4

రజిత సింధూరము.

రజతభస్మమునకు సమముగా శుద్ధిచేసిన ఇంగ్లీక మును చేర్చి తుమ్మచెక్క కషాయము, జిల్లేడుపాలు, మఱ్ఱి పాలు, హంసపాదియాకురసము, దూలగొండివేళ్లరసము, బెల్లపురసము అనువానిలో ప్రతిదానిచే నొక్కొక్క దినము చొప్పున మర్దించి ఏడు గజపుటంబులిడిన రజతభస్మము సిందూరించును.

రజితభస్మమువల్ల ఉపయోగములు.

కాంతి, బుద్ధిస్మృతి, ఆరోగ్యము, కామము, ధాతు సౌమ్యత, దేహపుష్టి, బలము, వీర్యవృద్ధి వీనిని కలుగ చేయును. త్రిదోషములు, జ్వరము, మేహము, కాస, శ్వాస, క్షయ, పాండురోగము, పైత్య కఫరోగములు, ఉదరరోగ ములు, మూలవ్యాధులు, శూల మొదలగు సమస్తరోగము లను హరించును. విరోచనము చేయును, చలువచేయును, మునిమి, దోషయుక్త విషమరోగములు, దోషమలము, పిత్తవాతము, గుల్మము, శ్లేష్మము, విషబాధ, ప్రమేహము, వాపు, ప్లీహ, యకృత్తు అనగా కార్జము [ లివర్ ] యొక్క రోగవికారము క్షీణత్వము గాయము వీనిని ఈ భస్మసేవ వలన అవశ్యముపోగొట్టును. తప్పదు.

ఈభస్మము వాడు క్రమము.

మోతాదు పూటకు రెండు మొదలు నాలుగు గురిగింజలయెత్తు. ఆవువెన్న మొదలగు అనుపానములతో పుచ్చుకొనదగియుండును. ఈభస్మము తెల్లగురిగింజయెత్తు సున్నములోగాని, నెయ్యిలోగాని, పుచ్చుకుంటే ప్రమేహములు, శర్కరమేహములు, వృష్ణవాయువులు, బహుమూత్రములు మానును. తేనెతోపుచ్చుకుంటే మేహవాయువులు హరించును. లేహ్యములుచేసి పుచ్చుకుంటే ఇంకా అనేకరోగములు మానును.

అశుద్ధభస్మ సేవవలన గలుగు దోషములు.

జ్వరము, తాపము, దేహదుర్గంధము, శుక్లక్షయము, దౌర్బల్యము, వీర్యహాని, రోగప్రాబల్యము మొదలగుదుర్గుణములు గలుగును.

రోగానుగుణ్య అనుపానములు

తాపముకు పంచదార, పైత్యముకు త్రిఫలచూర్ణము, ప్రమేహముకు త్రిశుగంధచూర్ణము, గుల్మములకు సర్జక్షారము, కాసకఫములకు త్రికటుకచూర్ణము అడ్డసరపాకు రసములో కలిపియును, శ్వాసకు గంటిభారంగి శొంఠియును,

క్షయకు సిలాజిత్తుయును, కార్శ్యరోగము [చిక్కుట] నకు మాంసరసము లేక ఆవుపాలలోనున్న, ప్లీహ అనగా నల్లదబ్బ రోగము, త్రిఫలచూర్ణం, పిప్పళ్లచూర్ణమును, ఉబ్బు రోగమునకు గలిజేరురసమును, పాండురోగమునకు మాం డూరమును, నవీసలితము (శరీరము ముడుతలుపడుట వెంట్రు కలు నెరయుట) మొదలగు వాటికి నేయితోను సేవించ వలయును. యిట్లు రోగములయొక్క అంతు తెలుసుకొని అనుపానముల గుర్తుయెరిగి వాడుకోవలయును.

స్వర్ణ భస్మము

సర్ణపు రేకులకు కాంతిరాయిని నిమ్మపులుసుతో మర్ధించి స్వర్ణపు రేకులకు పట్టించి ఈ ప్రకారం యేడుమార్లు కాచితే శుద్ధియౌను.

ఈ రేకులకు ఎర్రగావుండే ముండ్లతోటకూర నూరి ఈ ముద్దను స్వర్ణపురేకులకు కవచమిచ్చి శీలమన్నుయిచ్చి గజపుటంవేసేది. భస్మమగును.

సర్ణభస్మము రెండవక్రమము

శుద్ధిచేసిన బంగారము రేకులు చేయించి సన్నముగ టంకపు రేకులవలె సూక్ష్మముగా కత్తిరించి దానికి నాలుగవ

భాగము రసభస్మమునుచేర్చి నిమ్మపండ్లరసముతో మర్దించి రేకులపై లేపనముచేసి యెండించి ప్రమిదల సంపుటములో నుంచి, చీలమన్నుయిచ్చి, పుటంబిడి, సాంగసీతలమునదీసి యా సువర్ణపురేకులకు నాలుగవభాగము రసభస్మముకలిపి నిమ్మపండ్లరసముతో మరల మర్దించి ఎనిమిది పుటంబులిడిన సువర్ణము భస్మమగును.

స్వర్ణభస్మము మూడవక్రమము

శుద్ధిచేసిన బంగారము యొకభాగము, శుద్ధిచేసిన రసభస్మము రెండుభాగములు, యిటుల వీని నేకముచేసి యుదకములో మర్ధించి యందలి నీరునువడిపి ముద్దజేసి దాని కర్ధభాగము శుద్ధిచేసిన గంధకమును ఇంగ్లీకమునుచేర్చి ప్రమిదలోనుంచి చీలమన్ను లేపనముచేసి పుతంబిడిన భస్మ మగును. పిడప దానికి రెంటభాగము శుద్ధిజేసిన గంధకమును ఇంగ్లీకమును చేర్చి రెండుపుతంబులిడిన బంగారము శుద్ధ ముగా భస్మమగును.

స్వర్ణభస్మముయొక్క ఉపయోగములు.

దీనిని సేవించుటవల్ల, బుద్ధిబలము, శరీరకాంతి, ఆయుర్వృద్ధి, వీర్యపుష్టి, కామఘ్ను, ఆరోగ్యము, వాచా

లత్వము, స్మృతి, వీనిని కలిగించును. జ్వరము, మేహము, రాజయక్ష్మము, ముదిమి, శ్వాస, కాసలు, వాతము, శుక్ల నష్టము, పైత్యము, ప్రమేహము, గ్రహణి, అతిసారము, కుష్టు, విషము, ఉన్మాదము వీనినిబోగొట్టును, సంతోష మిచ్చును. సర్వేంద్రియములకు నరములకు సత్తువయును, శరీరసౌఖ్యమును గలుగజేయును. సమస్తశోధనారిక్రియలు చేయును.

అశుద్ధ సువర్ణభస్మ గుణము

అశుద్ధమైన సువర్ణభస్మము సౌఖ్య, వీర్యబలముల పోకడనుటయేగాక రోగమును దుష్టమైన వర్ణమును గలుగంజేయును. కావున బాగుగా శుద్ధిచేయబడిన సువర్ణమునే భస్మము చేయవలయును. శుద్ధిగాని భస్మములు సేవించిన రోగప్రాబల్యమును, అసౌఖ్యమును, బలవీర్యనాశనంబును మరణమును గలిగించును.

అశుద్ధ సువర్ణ భస్మసేవకు విరుగుళ్లు

శుద్ధిచేసిన కరక్కాయలచూర్ణమును, కలకండయును సమపాళ్లుగా గలిపి పూటకు బేడెత్తుచొప్పున రెండుపూటలను వారముదినములు పుచ్చుకొనుటయును (2) జటామాంసి

కషాయము పూటకు 4, 5, తులముల చొప్పున బదిదినములు పుచ్చుకొనుటయును యిందువలన అశుద్ధ భస్మదోషములు హరించును.

యిది వాడు క్రమము

మోతాదు పూట 1 మొదలు 2 గురిగింజల యెత్తు

అనుపానములు—గుంటకలవరాకు రసముతో సేవించిన సంభోగశక్తి అధికమగును. పాలతో సేవించిన బలమును, గలిజేరాకు రసముతో సేవించిన నేత్రరోగములను, నేతితో సేవించిన ముదిమియు పోగొట్టును. వసతో సేవించిన బుద్ధిని హెచ్చించును, కటుకరోహిణితో సేవించిన తాపమును, కుంకుమపువ్వుతో సేవించిన శరీరకాంతియును, అప్పుడు పితికిన ఆవుపాలతో సేవించిన దారుణ క్షయరోగములును, లవంగములు, శొంఠి, మిరియాలు వీనిచూర్ణముతో సేవించిన ఉన్మాదము, వాత, పిత్త, శ్లేష్మములు, యుద్రేకమును, ఉసిరిగపప్పుచూర్ణము తేనెలో సేవించిన దారుణ గ్రహణి రోగములును, తేనెతో సేవించిన విషములును, శంఖపుష్పి [పద్మపుతీగె] రసముతో సేవించిన ఆయుర్వృద్ధియును, నేలగుమ్మడిగెడ్డల చూర్ణముతో సేవించిన పుత్రోత్పత్తి గలుగును. ఈ విధముగా అనుపాన విశేషమును గుర్తుయెరిగి వాడుకోవలయును.

పాల్తుత్త భస్మము

ఒకఫలం పాలతుత్తమును కల్వములోవుంచి రుద్ర జడఆకుపసరుతో మర్ధించి బిళ్ల చేసి ఎండబెట్టి ప్రమిదలోపెట్టి శీలమన్ను చేసి యేరుపిడకలతో పుటంవేసేది. భస్మమగును.

దీనియొక్క గుణములు

వెగటుగా, కారముగ నుండును, తేలికనిచ్చును. విరోచనముచేయును, నేత్రములకు మేలుచేయును, క్రిమి రోగమును, దురదను, కుష్టువును, విషమును హరించును, మనోవికాశమునిచ్చును. అశుద్ధభస్మ సేవవలన పైత్య వికారము, వమనము పుట్టును.

అశుద్ధభస్మము సేవించిన విరుగుళ్లు

నిమ్మపండ్లరసము (దీనిని పూటకు 3, 4 తులముల చొప్పున మూడుదినములు ఉదయంపూట పుచ్చుకొన వల యును) (2) నీళ్లలోవేసి పిసికిన వరిపేలాలు మూడు, నాలుగు దినములు రెండుపూటలు పుచ్చుకొనవలయును.

కదళీఫల భస్మము

ఒక చిన్నకుండలో అరటిపండ్ల ముక్కలనువేసి నల్లేరురసముపోసి శీలమన్ను యిచ్చి గుంటప్రమిద్దె మూరెడు పుటంవేసేది. భస్మమగును.

ఈ భస్మముయొక్క గుణము

ఈ భస్మము విరోచనము చేయును. మేహశాంతి, వీర్యపుష్టి, బలము చేయును. చిక్కనిరక్తమును పుట్టించును. సంతోషము నిచ్చును, గుండెలను, పొట్టను మృదువు పరచును. కాకను పయిత్యమును, పొడిదగ్గును, అణచును. గొంతుకను శుభ్రపరచును.

దీనికి విరుగుళ్లు

1 అరటిపండ్లచర్మము, 2 పంచదార, 3 పటికిపంచదార, 4 తేనె, 5 యేలకులు, 6 మిరియాలుపొడి లేక కషాయము, 7 నెయ్యి, 8 పొగడపండు, 9 ఉప్పు, 10 అల్లము యివి అన్ని విరుగుళ్లు. ఈ భస్మమువల్ల పురాణ రక్తగ్రహణియు, రక్తాతిసారమును కట్టును,

రాతినార భస్మము

రాతినార ఆరుతులములుతెచ్చి ఖల్వములోవుంచి తెల్లబొడిశ ఆకురసముతో రెండుఝాములు మర్ధించి బిళ్ల చేసి ఎండనిచ్చి ప్రమిదలోవుంచి ఛీలమన్నుయిచ్చి పుటము వేసేది. యీ ప్రకారము మూడుపుటములు పెట్టవలయును.

5

భస్మీకరించును. ఈ భస్మము చలవ మిరియాల చూర్ణముతో చీనాచక్కెర కలుపుకొని యిందులో రాతినారభస్మమును మిశ్రితము చేసుకొని పుచ్చుకుంటె నీరుచురుకులు నీరుకట్టు ప్రమేహము ఉష్ణములు తీరును.

కఫరి భస్మము

కఫరి నాలుగుతులములు తీసుకవచ్చి కల్వములో వుంచి గాడిద గరప ఆకురసముబోసి మర్దించి బిళ్లచేసి బాగా యెండనిచ్చి మూకుళ్లలో నుంచి చీలమన్నుయిచ్చి యిరవై పిడకలతో పుటంబెట్టేది. భస్మమగును.

దీనియొక్క గుణములు

పయినబూసిన కుష్టురణములు, నేత్రరోగములు, విషము, వీనిని హరించును. దీని సేవవలన కుష్టు, నేత్ర రోగములు, వ్రణములు హరించును. అపరిశుద్ధ భస్మ సేవవలన చర్ది, వమనము, అరుచి, మొదలగు కొన్ని దుర్గుణముల పుట్టించును.

దీనికి విరుగుళ్లు

నిమ్మపళ్లరసము మూడుదినములు సేవించవలయును. 2 వరిపేలాలు నీళ్లలోవేసి బాగుగాపిసికి 2, 3 దినములు ప్రొద్దుటను సాయంకాలము పుచ్చుకొనవలయును.

### తురిసి భస్మము

సన్నపల్లేరు వేళ్లు కాటుకవలె నూరి మూసగాచేసి తురుసుకు కవచమిచ్చి చీలమన్నుయిచ్చి లఘుపుటంవేసేది. ఈ ప్రకారముగా [illegible] వేసిన తరువాత తీసుకుని బలముగా కవచమిచ్చి నాలుగవపుటము పెద్ద పుటముగా వేసేది. స్వచ్ఛమయిన భస్మము అగును.

### తెల్లతగర భస్మము

తెల్లతగరము నాలుగుతులములు తెచ్చి కరగించి యిప్పనూనెలో యేడుమార్లుబోసి తరువాత పుల్లటిపెరుగులో యేడుమార్లు బోయవలయును. అట్లుయొనర్చిన శుద్ధియై స్వచ్ఛమైనది అగును.

ఈ ప్రకారము శుద్ధిచేసి చింతాకువలె రేకులుచేయించి యఱ్ఱగన్నేరు వేళ్లపట్ట వకవీనె కాటుకవలె మర్దించి కవచమిచ్చి పుటం వేసేది. భస్మీకరించును.

### ఈ భస్మముయొక్క ఉపయోగము

సర్వమేహములను పైత్యములను హరించును. శుక్లనష్టము, ప్రమేహము, సెగరోగము, తాపము, పాండువు, క్రిమిరోగము వీనిని హరింపచేయును; మిక్కిలి

వీర్యవృద్ధి చేయును. భ్రమక్షయ, కఫము, శ్వాస, శూల, వమనము, ప్రదరరోగము వీనిని బోగొట్టును. బలము, వీర్యము, కామము, అగ్నిదీప్తి, బుద్ధిబలము, ధాతుస్థైర్యము, వీనిని తప్పక గలుగచేయును.

అశుద్ధభస్మ సేవవలన గలుగునష్టములు

వాంతి, భ్రాంతి, శుక్లనాశనము, తాపము, గుల్మము, కుష్టువు, పాండువు, ప్రమేహము, పొక్కులు, వాతము, పక్షవాతము, రక్తవికారము, కామక్షయము మొదలగు ననేక మహారోగములు గలుగును.

అశుద్ధ భస్మ సేవవలన గలిగినవాటికి విరుగుళ్లు

బద్దివేరుచెక్క చూర్ణములో సమముగా పటిక బెల్లము చూర్ణము కలిపి పూటకు మూడుఅణాలయెత్తు చొప్పున రెండుపూటలను పది లేక పదిహేనుదినములు పుచ్చుకొనడము.

తాడికాయ, వుసరికాయ, కరక్కాయ, పిప్పళ్లు వీటిచూర్ణము పైనచెప్పిన విధమున సేవించవలయును.

### ఈ భస్మము సేవించుటకు అనుపానములు కుదురు రోగములు

ఈ భస్మము మోతాదు 1 మొదలు 8 గురిగింజల ఎత్తువరకున్ను, పచ్చకర్పూరంతో సేవించిన నోటి దుర్గంధం పోవును. ఆవుపాలతోగాని జాజికాయగాని సేవించిన వీర్య పుష్టి గలుగును. ప్రమేహమందు తులసియాకురసముతోడను, గుల్మము, ప్లీహ వీనియందు వెలిగారక్షారముతోనున్ను.

పాండువునందు ఆవునేతితోడను, ఊర్ధ్వశ్వాస, రక్త పిత్తము, వీనియందు పసుపుచూర్ణముతోడను, పైత్యము నందు శక్కరతోడను, సేవించవలయును. తేనెతో సేవించిన బలముగలుగును. కస్తూరితో గాని సేవించిన అజీర్ణమును, వెల్లుల్లిరసముతో సేవించిన హస్తిగత జ్వరమును, వావిలి ఆకురసముతో సేవించిన కుష్టురోగమును, మజ్జిగతో సేవిం చిన వాతగుల్మ రోగములును, ఉత్తరేణి సమూలముతో సేవించిన శిరోరోగమును, జాజికాయ, జాపత్రి, లవంగ ములు సముదాయ చూర్ణముతో సేవించిన నడుమునొప్పి పచ్చకర్పూరము కుంకుమపువ్వు వీనితో ఒకపక్షము సేవిం చిన చలువ జేయును.

6

స్వేతవంగభస్మము

నేరేడు చెట్టువేళ్ల పట్టనూరి గొబ్బరికాయంత ముద్ద చేసి తగరము రెండుఫలాలు రేకులుగాకొట్టి పయిన బట్ట కవచమిచ్చి గజపుటములు వేసేది. భస్మీకరించును.

అనుపానములు గూర్చి ఆయా వ్యాధులకు యేయే అనుపానములో ఆయా అనుపానములతో యిచ్చేది.వ్యాధులు తీరును.

శంకుపాషాణ భస్మము

శుద్ధిచేసిన శంకు పాషాణము అరకోడిగుడ్ల పెంకులు ఫలమున్నర యివి రెండున్ను ఖల్వములోవుంచి జిల్లేడు కాయలలో పప్పు రసముదంచి తీసుకొని ఈ రసముపోసి ఆరుఝాములు మర్ధనాచేసి బిళ్లచేసి యెండించి పలుచగా యుండే చిన్నప్రమిృదలోమూసి, చీలమన్నుయిచ్చి లఘు పుటంవేసేది. భస్మమగును.

ఈ భస్మము బియ్యపుగింజ ప్రమాణము బిలపత్ర చూర్ణము తేనె వీటితో అనుపానముగా పుచ్చుకుంటే చలి జ్వరములు, వరుసజ్వరములు తీరును.

యిందుకు పత్యము

కందిపప్పు, వంకాయ, మునగకాయ, కొయ్య తోటకూర, తియ్యచారు, అన్నము.

పులుసు, పొగాకు కూడదు.

శృంగి భస్మము

దుప్పికొమ్ములు వకవీసెడుతెచ్చి అంగుళ ప్రమాణముగా తునకలుచేసి అపామార్గమూలికను కవచముచేసి నీరు లేకుండా యెండబెట్టి బాగాఎండినతర్వాత మూరెడు గుంట త్రవ్వి ఏరుపిడకలతో పుటంవేస్తే భస్మీకరించును.

దీని ఉపయోగములు

ఈ భస్మం గురిగింజయెత్తు తేనెతో పుచ్చుకుంటే వాయువులు, రొమ్మునొప్పులు, కడుపునొప్పులు, హరించును. చక్కెర ( పంచదార ) తో పుచ్చుకుంటే పిత్తవాయువులు, దేహమందలి నొప్పులు తీరును. యిందుకు వాతవస్తువులు మానవలయును.

యిచ్ఛాపత్యము.

## అభ్రక భస్మము

క్రిష్ణాభ్రకము రేకులుగా వలిచి పుల్లటినీళ్లలో వేసి నలుబది దినములు వూరనిచ్చి ఎత్తుకొని రోటిలోవేసి చూర్ణముగా దంచి అవిశాకు రసమున రెండుదినములు తెల్లజిల్లేడు రసాన రెండుదినములు మర్దించి బిళ్లచేసి మూకుటిలోబెట్టి ఎండలోవుంచి ఎండనిచ్చి ఎండినతరువాత పయినమూకుడుమూసి చీలమన్నుచేసి ఎండబెట్టి గజంలోతు గజం వెడల్పు గుంటత్రవ్వి గుంట సగమువరకు యేరు పిడకలు పరచి ఈ పిడకలమీద ఔషధంబెట్టి పయిన గుంట నిండుగ యేరుపిడకలువేసి పుటంవేసేది. భస్మమవును. ఈ భస్మము సకల ఔషధములకు ఉపయోగించుకొనేది.

## అభ్రక భస్మముయొక్క గుణములు

అనుపాన విశేషములతో నిచ్చిన త్రిదోషములు హరించును. గ్రహణి, క్షయ, ప్రమేహము, మూలవ్యాధి, అతిమూత్రము, శ్వాస, కాస, విషము, కుష్టు, వాతరోగములు పిత్తరోగములు, క్షీణత్వము, గాయములు, పాండువు, భ్రమ, కామిల, గుల్మము మొదలగు ననేక రోగముల నివృత్తి చేయును. మేహశాంతి, వీర్యవృద్ధి, దేహపుష్టి, ఆయుర్వృద్ధి,

అగ్నిదీప్తి, బలము, రక్తపుష్టి వీనిని కలుగచేయును. మిక్కిలి ఆరోగ్యకరమయినది. మరియు నీనికి సువర్ణ భస్మముయొక్క గుణములు గలిగియుండును.

అశుద్ధ భస్మసేవకు విరుగుళ్లు

ఈ భస్మసేవవలన అనేకరోగములు పుట్టును. దీనికి విరుగుడు ఉసిరిగవరుగునీళ్లబోసి నూరి తీసినరసమునుగాని పచ్చికాయల రసమునుగాని పూటకు మూడు నాలుగు తులములయెత్తు రసము చొప్పున ఉదయంపూటను మూడు, నాలుగు దినములు పుచ్చుకొన్న అశుద్ధాభ్రక దోషములు నివర్తించును.

ఈ భస్మముకు పోవురోగములు అనుపానములు

పిప్పలిచూర్ణము, తేనె ఈ రెంటితో సేవించిన, కాస, శ్వాస, విషము, భ్రమ, కామిల, గుల్మ, పాండువు, గ్రహణి, కఫము, క్షయ, ప్రమేహము, పైత్యము, వాతము, కుష్టువు, జీర్ణజ్వరము, అరుచి, వీనిని హరించును. శుక్లవృద్ధి, బుద్ధిబలమును గలుగును. శిలాజిత్తు, పిప్పలి చూర్ణము,

7

తేనెతో సేవించి ప్రమేహరోగము లన్నియు నివర్తించును. స్వర్ణభస్మముతో సేవించిన క్షయరోగములు నివర్తించును. ధాతుపుష్టికలుగును. కరక్కాయచూర్ణము బెల్లము వీనితో సేవించిన వాతరక్తము, యేలకులు చక్కెర వీనితో సేవించిన రక్తపిత్తమును హరించును; నేలవుసిరి, శర్కర పల్లేరు, ఏలకులు వీనిచూర్ణము ఆవుపాలతో సేవించిన మూత్రకృచ్ఛ్రము ప్రమేహము హరించును. తిప్పనత్త కండ శర్కర వీనితో సేవించిన ప్రమేహము లన్నియు నివర్తించును; త్రిఫలచూర్ణము, ఆవునేయి తేనె, వీనితోసేవించిన వీర్యవృద్ధికలుగును; నేత్రరోగములుహరించును. జీడిగింజలతో నిచ్చిన అనేకవిధములయిన మూలవ్యాధులు నివర్తించును; గంజాయిఆకు చూర్నముతోనిచ్చిన వీర్యస్తంభన గలుగును; గంటిభారంగి, పుష్కరమూలము, శొంఠి, పెన్నేగడ్డ వీనిచూర్నము తేనెతో సేవించిన వాతరోగములు హరించును; పేకచూర్నము పిప్పళ్ళచూర్నము, తేనె, వీనితో సేవించిన కఫరోగములు హరించును; యవక్షారము మొదలగు క్షారములతోసేవించిన మూత్రకృచ్ఛ్రము, అగ్నిమాంద్యము. మూత్రఘాతము యివి నిస్సంశయముగ హరించును; లవంగాలు, తేనె,వీనితోసేవించిన, శుక్లవృద్ధికలుగును; ఆవుపాలు, చక్కెర వీనితోసేవించిన పిత్తరోగములన్నియు హరించును.

సూతభస్మము.

పదిహేనుతులముల పాదరసము ఖల్వములోనునిచి ఇటికరాయి పొడివేసి ఒకగడియసేపు మర్దించి నీళ్ళతో కడగ వలయును. ( వేడినీళ్ళు. )

తిరుగ కరిదూపమునువేసి రెండుగంటలకాలము మర్దించి నీళ్ళుపోసి కడిగేది.

కలబంద రసముతో రెండుఘడియలు మర్దించి నీళ్ళు బోసి బాగుగాకడిగేది. శుద్ధియౌను.

యీప్రకారం శుద్ధిచేసిన పాదరసము మూడుతుల ములు ఖల్వములోయుంచి యర్రటి వుత్తరేణిరసముతో రెండుదినములు నూరి ఘనమైనరసముకు కవచమిచ్చి లఘు పుటమువేస్తే భస్మముఅగును.

ఈభస్మము సకలఔషధములలోను వాడుకొన వచ్చును. యీభస్మము బియ్యపుగింజ ప్రమాణము తాటి బెల్లముతోగాని, అక్కులకర్రనూరి శనగగింజప్రమాణము ముద్దయెత్తుకొని కొద్దిపల్లముగాచేసి యందులో బియ్యపుగింజ ప్రమాణము రసభస్మముపెట్టి మూతమూసివుండగాచేసి

అంగిటవేసి మ్రింగివేయవలయును. ఈలాగున మూడుదిన ములు ఆరుపూటలు అయిదుదినములు పదిపూటలుగాని ఏడు దినములుగాని పుచ్చుకునేది. రోగముయొక్క బలాబలము చూచుకొనియిచ్చేది.

ఇందుతీరువ్యాధులు.

మేహాశల్దిరోగములు ప్రమేహవ్రణములు, చేతులు కాళ్ళుపట్టు, వడిశగడ్డలు, కరిమేహములు, మేహగడ్డలు, శూలలు, గుల్మరోగములు పసిమితెలుపురోగములు, కంఠ మాలలు, బగంధరములు, కుష్ఠురోగములు. మొదలగునవి మానును.

యిందుకుపథ్యం.

కందిపప్పు, కొయ్యతోటకూర, లేతవంగపిందెలు, మునగ పిందెలు, పెద్దచిక్కుడుకాయలు, కొద్దిగా పులుపువేసినచారు, ఆవుపాలు, అన్నము పుచ్చుకునేది. ఒకవేళ నోరుపొక్కితే తుమ్మచెక్క పూటపట్టేది.

86 లవణభస్మం.

అందువుప్పుఫలము, 2 పెట్లు వుప్పుఫలం, 3 వెలి గారంఫలం, 4 పటికారముఫలం, 5 కల్లుప్పుఫలం.

యీపంచలవణములను నిమ్మపండ్లరసముతో నాలుగు ఝాములు మర్దించి, బిళ్ళచేసి ఎండబెట్టి పెద్దబానికలోపెట్టి పయినమూసిచీలమన్నుయిచ్చియేరుపిడకలతో పుటంపెట్టేది. తరువాతయెత్తుకొని ఖల్వంలోవుంచి కుప్పింటాకు రసంతో రెండుఝాములు మర్దించి బిళ్ళచేసి పయిమాదిరిగానే పుటం వేసేది. తరువాత ముల్లంగిరసంతో రెండుఝాములు మర్దించి బిళ్ళచేసి ఎండనిచ్చి ప్రమిదలోబెట్టి గట్టిగా చీలమన్నుచేసి పుటంవేసేది. భస్మమగును.

ఈభస్మము యెనిమిది గురిగింజలయెత్తు తేనెతో పుచ్చుకుంటే గర్భవాయువులు, కడుపునొప్పులు, హరించును. కళింగాదిచూర్ణముతో పుచ్చుకుంటే సూతికావాయులు, శూలలు, నీరుకట్టు, శరీరంనొప్పులు, కాళ్లచేతుయిపోట్లు మొద లగునవి హరించి ఆరోగ్యముగలుగును.

8

## 87 కంచుభస్మము.

ఒకఫలం కంచుపొడి చేసి మూసలోవేసి కాచికాచి పుల్లనిమజ్జిగలో మూడుసార్లు పోయవలయును. అట్లుపోసిన యడల శుభ్రమయిన వస్తువగుటయేగాక శుద్ధియగును.

తరువాత దానిని ఖల్వాములోవుంచి కారం వరహా యెత్తు పెట్లుప్పు, సున్నం వరహాయెత్తు చేర్చి నీలియాకు రసముతో నాలుగుఝాములు మర్ధించి బిళ్ళచేసి ఎండనిచ్చి ప్రమిదలోబెట్టి చీలమన్నుయిచ్చి వరాహపుఠంవేసేది. తిరుగ యెత్తుకొని ఖల్వాములోవుంచి పయినచెప్పిన ప్రకారమున్ను పెట్లువుప్పు సున్నమునుగూర్చి పయినచెప్పిన మూలిక రసముతో నాలుగుఝాములు మర్దించి బిళ్లచేసి ప్రమిదలో యుంచి చీలచేసి యేబదిపిడకలతో పుఠంవేసేది. భస్మమవును. ఈ భస్మము నేతితో పుచ్చుకుంటే క్షయరోగమును, శ్వాస కాసము, రాచపుండ్లు తీరును. ఇచ్ఛాపథ్యం.

## అయభస్మము

ఒకఫలము అయము పొడిచేసి అయమును ఖల్వా ములో యుంచి నిమ్మపండ్ల రసముతో ఒకదినము మర్దించి

బిళ్లకట్టి ఎండనిచ్చి ప్రమిదలోయుంచి చీలమన్ను యిచ్చి ముప్పది పిడకలతో పుఠంవేసి యెత్తుకుని ఖల్వమున నుంచి నేరేడుచెక్క రసముతో మర్దించి ఆ మర్దనాచేయుటలో యన్ని వరహాలయెత్తు వెలిగారంవేసి కుప్పింటాకు రసము బోసి బాగా మర్దించి బిళ్లచేసి ఎండనిచ్చి ప్రమిదలోయుంచి చీలమన్ను యిచ్చి యిరువదిఅయిదు పిడకలతో పుఠంబెట్టిన భస్మీకరించును.

దీనియొక్క గుణములు

ఈ భస్మము ఆవునేతితో గురిగింజ ప్రమాణము పుచ్చుకుంటే దేహములోయుండే మేహరోగములు తీరును. పాండురోగములు తీరును. చక్కెరతో పుచ్చుకుంటేవిషనీరు, విషరోగములు పరుగెత్తిపోవును. ఇచ్ఛాపథ్యము.

మణిసిల భస్మము

మణిసిల మూడుపలములు, సహదేవివెన్ను మూడు తులములు, పెట్లుప్పు మూడుతులములు, యంద్రకాయపెంకులు మూడుతులములు యివియన్నియు ఖల్వములోవేసి నిమ్మపండ్ల రసముతో మూడుఝాములు మర్దించి ఎండబెట్టి ప్రమిదలోయుంచి శీలమన్నుయిచ్చి మయూరపుఠంవేసేది. భస్మమగును.

దీనియొక్క గుణము

భూతజ్వరములును, యితరజ్వరములును, విషమును, కఫవాతములను, కుష్టును, బోగొట్టును. దేహదారుఢ్య మిచ్చును. కొన్ని ఔషధములలో ఉపయోగింపనగును.

అశుద్ధభస్మమునకు విరుగుళ్లు

క్రమముగా శుద్ధిగానిభస్మము ననేకరోగముల పుట్టించును. ఆవుపాలలో తేనెవేసి మూడుదినములు సేవించిన అశుద్ధభస్మ వికారములు యావత్తు నశించి సౌఖ్యమిచ్చును.

అమలగంధక భస్మము

నెల్లికాయ గంధకము చిన్నమొగబిడ్డలమూత్రములో వకసారిశుద్ధి, రెండవసారి బూడిదగుమ్మడికాయ రసములో శుద్ధి, మూడవసారి చెరకుపాలతో శుద్ధి చేయవలయును. దీనిని శుద్ధిచేయు పద్ధతి యేలాగంటే వక చట్టిలో చిన్న మొగబిడ్డల మూత్రముబోసి చట్టికి వకగుడ్డ మూతగా గట్టి మూతపయిన గంధకముపోసి పయిన మరియొక చట్టి సందు లేకుండామూసి గట్టిగా చీలమన్ను యిచ్చి ఆరనిచ్చి గుంట

త్రవ్వి గుంటలో ఈ చట్టిని చక్కగా అమర్చి చట్టిపయిన 40 పెద్దపిడకలు పేర్చి పుటంవేసేది. గంధకము కాలిక్రింద చట్టిలోకి మణిమణులుగా దిగియుండును. దానిని యెత్తుకొని కడిగివేసి ఎండబెట్టేది. ఈ గంధకమును ఖల్వములో వక ఫలం గంధకమునువేసి నల్లటి కోడిపెట్టిన కోడిగుడ్లను పగుల గొట్టి అందులోవుండే పచ్చటి కరువు పారవేసి తెల్లటికరువు వక పింగానీలో యుంచుకొని ఖల్వములో గంధకముపోసి చెయ్యి వదలకుండ మూడుదినములు మర్దించి తెల్లటిపింగా ణీలో యుంచి ఎండబెట్టేది. ఈ ప్రకారముగా ఘనముగా ఎండబెట్టితే భస్మీకరించును.

యిది వాడుక్రమము

గంధకభస్మము అర్ధగురిగింజయెత్తు తేనెతో పుచ్చు కుంటే మేహరోగములు మేహవాయువులు మానును.

మిరియాల చూర్ణముతో పుచ్చుకుంటే అండము యెక్కడం, దిగడం సహించనిపోటు ఇవిమానును. ఫిరంగి చెక్క చూర్ణముతో పుచ్చుకుంటే మేహ ప్రమేహములు మానును. పైత్యరోగములకు జీలకర్ర చూర్ణము మరియు ఈ భస్మముచేరిన లేహ్యముతో పుచ్చుకుంటే వీర్యస్తంబన మౌను.

మరియు నీభస్మము తెల్లజిల్లేడుపాలలో కల్పి వక ఫలం ఉలాందలింగమునకు నార్థముగా పూసి కట్టియిచ్చిన యడల మైనమౌను. ఈ మైనమును మిర్యపుగింజ ప్రమాణము తేనె యందుపుచ్చుకుంటె వాత వాయువులు, మేహ వాయువులు హరించి ఆరోగ్యము గలుగును.

95 గంధకభస్మము రెండవప్రకరణము.

సోలగంధకమును తీసుకువచ్చి పాషాణపు ఆకు ముద్దగా నూరి ఈముక్కలకు కవచమిచ్చి ఒకపిడతలో మోదుగుచెక్కయొక్క క్షారమునుపోసి అందులో ఈముక్కలను యిడిపైనతిరుగఆక్షారమునుపోసి చీలమన్ను యిచ్చి పుటంవేయవలయును. యిట్లువేసిన స్వచ్ఛమైన భస్మమగును.

యిది అన్నిటియందు వాడుకొనదగి ఉన్నది.

96 గంధకభస్మముయొక్క వుపయోగములు వాడుక్రమమును.

ఈభస్మము భ్రమ, దాహము, శోష, పైత్యము. వీనినిహరించును. నేత్రములకు బలమునిచ్చును. దేహపుష్టి, బలము, అగ్నిదీప్తి వీనినిచ్చును. సర్వకుష్టులు, శూలలు, సర్వక్రిమిరోగములు, వాతపిత్తము, సవాయి, చిడుము, గజ్జి, ఇతరచర్మరోగములు, క్షయ, శ్లేష్మము, వీనిని నివృత్తి

చేయును. బుద్ధిబలము, వీర్యవృద్ధి, ఆయుర్వృద్ధి, వీనిని గలుగచేయును. మోర్లుదిగడమును పోగొట్టును. కాకచేసి సమురునుపుట్టించును. సౌమ్యముగా విరోచనము చేయును. పీల్చుశక్తిగల నరములయొక్క వ్యాధులను ఆంబవాతమును పోగొట్టును. అనుపాన విశేషములచేత సమస్తరోగములను జయించును. క్రమముగా శుద్ధిగాని అభ్రకము, రసభస్మము, వీనివలన గలిగెడు రోగములను సైతము నివారించును. గంధకము క్రమముగా శుద్ధికానియడల ననేకరోగములను పుట్టించును. దీనికి విరుగుళ్ళు, 1 నెయ్యికలిపిన ఆవుపాలు 2 లవంగమును వస వీని చూర్ణము 3 గరికివేళ్ళ రసము లేకకషాయము యీమొదలయిన వస్తువులు సేవించిన గంధక దోషము పోవును.

ఈగంధక భస్మమును అధికముగా దినిన నీరస పెట్టును. గనుక గంధక భస్మమును తినుకాలమున అప్పు డప్పుడు బలకరమైన అవుషధములను వాడవలయును. మోతాదు ( 4 మొదలు 16 ) గురిగింజలయెత్తు వరకున్ను. విరోచనమునకు మోతాదు పావలాయెత్తు మొదలు తులము వరకును బెల్లముపాకముతో వుండచేసి గాని ఆవుపాలతో

గలిపిగాని పుచ్చుకొననగును. వీనిని నల్లజీలకఱ్ఱను సమ భాగములుగా చూర్ణంచేసి మంచినూనెలోగాని కొబ్బరినూనె లోగాని గలిపి దేహమునకు పూసిన గజ్జి, చిడుము, సవాయి పొక్కులు, చెర్మరోగములుపోగొట్టును.

## 97 అనుపానములతో భస్మసేవ

త్రిఫల చూర్ణముతో నిచ్చిన నేత్రరోగములు ఆవునేతితో నిచ్చిన వ్రణములు, ఆవునెయ్యి, తేనె, వీనిలోకలిపి కండ్లకు బెట్టిన శుక్రమను నేత్రరోగమును, మిరియాల చూర్ణము ఆవునేతితో గాని పిప్పళ్లచూర్ణము ఆవునేతితోగాని యిచ్చిన కాసరోగము, నేలములగవిత్తులు ఆవునెయ్యి వీనితో నిచ్చిన శ్వాస. పిప్పళ్ళ చూర్ణము తేనెతో నిచ్చిన జ్వరభంగము. (గొంతుక వెలుగురాయుట) తమలపాకుల రసముతో నిచ్చిన పార్శ్వపునొప్పి, నిమ్మపండ్ల రసముతో నిచ్చిన విశూచి, బెల్లముతో నిచ్చిన ప్రమేహము, ఉసిరిగపప్పు చూర్ణముతోనిచ్చిన అజీర్ణము, నువ్వులనూనెతోనిచ్చిన దద్దురరోగము, శొంఠి తేనెతోనిచ్చిన గ్రహణి, నింబపం చాంగము వేపచెట్టుయొక్క చెక్క పువ్వు కాయ వేరు ఆకు చూర్ణముతో నిచ్చిన కుష్ఠురోగము, తులసిఆకులరసము

నెయ్యితోనిచ్చిన వాతరోగము, ఆవునేతితోనిచ్చిన పయిత్య రోగము, శొంఠి, బెల్లముతో నిచ్చిన కఫరోగమును హరించును. శుద్ధగంధకభస్మము పదిపలములు గుంటకలగరరసము అయిదుపలములతోనూరి యెండించి దానికి అర్ధభాగము కరక్కాయలచూర్ణముగలపి తేనె ఆవునెయ్యితో రెండుమాసములు సేవించిన ముసలితనము పోవును. విశేష వీర్యవృద్ధి గలుగును.

98 ప్రవాళభస్మము.

పగడములుతెచ్చి ఖల్వములోవుంచి తెల్లజిల్లేడు పాలతో నాలుగుఝాములు మర్దించి బిళ్ళచేసి ఎండబెట్టి బాగా యెండినతరువాత ప్రమిదలోపెట్టి కుక్కుటపుటంవేసేది. తరువాత యెత్తుకొని వాకుడురసముతో మర్ధించి బిళ్ళచేసి ఎండనిచ్చి ప్రమిదలోవుంచి చీలమన్నుచేసి పుటంవేసేది. భస్మీకరించును. ఈభస్మము గురిగింజయెత్తు వాకుడుచూర్ణముతో గాని పుచ్చుకుంటే వాత క్షయలు, మేహక్షయలు, కఫక్షయలు హరించును. తేనెయందు పుచ్చుకోవచ్చును.

99 సవ్వీర భస్మము.

ఒకఫలము సవీరమునుఖల్వములోనుంచిఅడవిఆముదవుచెట్టు

అనగా తెల్లగాయుండే ఆముదపుచెట్టు పాలుతో నాలుగుయామములుమర్దించి గన్నేరాకులరసముతో రెండుఝాములు మర్దించి బిళ్ళచేసి బాగుగాఎండనిచ్చి ప్రమిదలోవుంచి గట్టిగా చీలమన్నుయిచ్చి యేరుపిడకలతో పుటంవేసేది. భస్మమగును.

100 యిదివాడుక్రమం, ఇందున తీరువ్యాధులున్ను.

1 సర్వీరభస్మము వరహాయెత్తు 2 శొంఠి వరహాయెత్తు 3 మిర్యాలు వరహాయెత్తు 4 లవంగాలువరహాయెత్తు మూడు సన్నపిప్పళ్ళు చిత్రమూలంవేరుపట్ట అయిదుతులములు ఈవస్తువులను వెచ్చచేసి చూర్ణముచేసి ముందుగా సర్వీరభస్మాన్ని ఖల్వమునందుంచి యీచూర్ణముబోసి చనుపాలతో పకఝాము మర్దించి మిర్యాలు, లేక కందిగింజప్రమాణం మాత్రలుచేసి సన్నిపాతజ్వరితులకును, దోషజ్వరములు, దోషములుకలిగినవార్లకు మహాజ్వరములు, వాయువులు పుట్టినవార్లకు ఒకమాత్రయిచ్చేది, నయమగును.—ములగచెక్క 2 వులిమిరిచెక్క 3 జిల్లేడువేరుచెక్క—యివికషాయముబెట్టి ఒకటొన్సు కషాయము త్రాగించేది, సన్నిపాతములు హరించును.

1 అక్కలకర్ర 2 విషబొద్దివేరు 3 వావింటవేరు వీటి కషాయముతో యిస్తే జ్వరములు, దోషము మొదలయిన వాతములు హరించును. వీటిలో చనుపాలు మిశితముచేసి యిస్తే దాహము నాలుక ముండ్లు పారినదోషములు హరించును.

## 101 అన్నభేది భస్మము

అన్నభేది తెచ్చి కల్వములోయుంచి నిమ్మపండ్ల రసముచేత నాలుగుయామములు మర్దించి బిళ్ళచేసి ఎండనిచ్చి ప్రమిదలోపెట్టి మరియొకప్రమిదెమూసి చీలమన్నుయిచ్చి పుటంవేసేది. తరువాత బోడసరముసమూలముతెచ్చి రసము దీసి ఆరసముతో రెండు యామములు మర్దించి బిళ్ళచేసి ఆర నిచ్చి ప్రమిదలోపెట్టి మరియొకప్రమిద బోర్లించి చీల మన్నుయిచ్చి పుటంవేసేది. భస్మీకరించును.

## 102 ఈభస్మముయొక్క ఉపయోగములు

అగ్నిదీప్తినిచ్చును, వాతము, రఫము, కుష్ఠువు. జ్వరము, క్షయ, పాండువు, వీనిని హరించును. మంచిరక్త మును బుట్టించును. వెంట్రుకలకు బలమునిచ్చును; అన్న మరుగచేయును; రక్తమును శుభ్రపరచును; బలముచేయును; మృతురక్తమును జారచేయును; క్రిమి, అతిమూత్రము

ఋతుబద్ధము, దగ్గు, అగ్నిమాంద్యము వీనిని హరించును. పాతవ్రణములు, పుట్టవ్రణములు, (అనగా వెలలువేయు పుండ్లు) గండమాలలు, మాంసముకుళ్ళిపొయ్యే లేక తినివేసే వ్రణములు, వీటిపై ఈ భస్మము నీళ్లలో కలిపి గడిగిన మానును; దీనిని రేవలచిన్నితోగాని బాలింతబోలుతోగాని, యేలకులు లవంగాలు, దాచినపట్ట, నాగకేసరములు వీని చూర్ణములలో గలిపిగాని, జన్షను అను ఇంగ్లీషువారు వాడేమూలికసారములో గలిపిగాని మాత్రలుచేసి ఇయ్యవగును.

103 మోతాదువాడు క్రమము

ఒకటిమొదలు పూటకు మోతాదు ఆరు గోధుమగింజలయెత్తువరకును. అపరిశుద్ధ అన్నభేది భస్మముకు విరుగుళ్లు. గాడిదలద్దె రసము దీనిమోతాదు పూటకు 3 లేక 4 తులములయెత్తు చొప్పున మూడు నాలుగు దినములు సేవించిన వికారముడుగును. యిది పయినచెప్పిన వ్యాధులకు బాగుగా పనిచేయును.

కనకదండి సీతారామయాఖ్య ప్రణీత శతభస్మయోగ రత్నాకరే ప్రథమోధ్యాయ స్సమాప్తః.

సం పూ ర్ణ ము.

శ్రీ శ్రీ శ్రీ